# పుష్పబాణవిలాసము

కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

పుష్పబాణవిలాసమ్ము పొలుపు గొలుప
విపులకీర్తి పేరిటి కూర్చుపీనసుకుచ
కులుకుకౌఁగిళ్ళ సుఖలబ్ధి వెలయు మన్వ
**హమ్ము జోస్యుల యజ్ఞనారాయణాఖ్య**

ఓం

# పుష్పబాణవిలాసము

అవతారిక :— గోపికాలోలుఁడవు గోపాలునిపవిత్ర చరిత్రమును బ్రతిపాదించు నీశృంగారకావ్యమును రచింపం బూని కవి తొల్దొల్తఁ దనకును బాఠకులకును శుభము గలుగు నటులు భూదైవతము మగణమును బ్రయోగించి యాశీర్వదించు చున్నాఁడు.—

శా. శ్రీమద్గోపవధూస్వయంగ్రహ సమాశ్లేషంబులం దత్కుచ
వ్యామర్దంబున గంధపుంబొడులు వ్రానైనం, గుబాళింప మై
నామోదమ్ము, లసుప్తిరక్తనయనుండై ప్రొద్దుటన్ నూతన
శ్రీమాన్యుం డవు జారగోపకుఁడు కూర్మిన్ మీటి మి మ్మేముతన్.

పదఁపడి వాగ్దేవియు సమస్తప్రాణులకు వాక్కు నొసఁగి రక్షించునదియు నవు భాషాయోషామణిని రచయిత తనకు మృదుమధుర వచఃపరంపరలు వఱల నభినుతించు చున్నాఁడు.—

ఉ. సల్లలితప్రధానరస
సంభృతకావ్య మొకండు కూర్తు నే
వల్లవపల్లవాధరలు
పల్వురఁ గూడి రమించు కృష్ణుఁడా
నెల్లజగంబులం బ్రథితి
కెక్కిన రమ్యచరిత్ర మూతగాఁ
బల్లవపాణీ, వాణి! దయ
వారఁ బ్రసన్నవు కావె వేఁడెదన్.

రూపవయోలక్షణాదికముల నన్యోన్య మనురాగము గలవా రయ్యు నిరువురు నాయికానాయకులు లోకచోఁ గూడి క్రీడించుభాగ్యము లేమిఁ బరితపించుచు దైవవశమున నొకనాఁ డేకాంతమునఁ గలిసికొనిరి. అప్పటి వారిస్థితు లిందు వర్ణింపఁబడుచున్నవి.—

చ. చెలువుఁడు చూపుత్రోవఁ బడఁ
జేరెఁడుకన్దోవ లుల్లసిల్లె; మైఁ
బులక లెలర్చెఁ గుంజవరముం
జనహాస్యము జేరినంతఁ; జ
న్నులు నులుమంగఁ బూనుడుఁ
దనూలత కంపము నొందెఁ; గౌఁగిటన్
లలిఁ గదియింపఁ వీడె సుదృఢం
బయి నీవి తనంత నింతికిన్.

## సంభోగశృంగారము

వీధిగుమ్మమున నిలువఁబడియుండి సాభిప్రాయముగఁ దనను జూచు నొకయొయ్యారి చేష్టలను గమనించుచుండిన కాముకుఁ డొకఁడు తనచెలికాని కామెం జూపుచు ని ట్లను చున్నాఁడు.—

సీ. ఫుల్లమై యల్లన మోమును నెత్తమ్మి
మిసిమిపుప్పొడిజాళ్ళు దెసలఁ గ్రమ్మ;
మొలకనవ్వుల మొవ్వములు మృదుగండమం
డలములఁ బండువెన్నెలలు గాయ;
నిబ్బరపుంగబ్బిగుబ్బలయుబ్బు లో
రసికొంచు వలెవాటు దుసికి జార;
వంచిత్తులై సమీపించువారలు తను
జెప్ప లార్పక వాయి విప్పి చూడ;
నోరమోమిడి, గేహాలి నునిచి యొకరుఁ
డడుగు, చెంపఁ జేరిచి యరముడుతచేయి,
మీర సాకూతగతి, యుండి దూరముననె
నన్ను గన్గొను నామృగీనయనఁ గనితె?

అనుకొనినసంకేతము ప్రకారము పూవులుగోయు నెపమునఁ దోటలోనికి వచ్చిన యొక కామినికిఁ గాముకుఁడు తాము రహస్యముగ విహరింప ననువవు దావుఁ జూపుచు ననుచున్నాఁడు.—

మ. ఇగురుంబోఁడి! నికుంజ మిద్ది
కనుగొంటే, మాధవీవారమ
ధ్యగమై రాలినపూవుగుత్తుల
సురమ్యం బిందుఁ గందర్పక్రీ
డఁ గడున్ మత్తిలు బోంట్లయూంకృతులు
వెల్గా వింతయుం, గోకిలా
దిగలాలాపముతోడ నేకమయి
యుద్దీపించు హృద్యమ్ములై.

తోడిచెలికత్తెలతోఁ బూవులు గోసికొనుటకై పూఁదోఁట కరుదెంచిన యొకమించుబోఁడిని దార్పకత్తె పూవులు, తీగలు, వింతలు, జూపుచు దూరమునకుఁ గొంపోయి వేచియున్న జారునితోఁ గూర్చి, చేరువన తాను కావలియుండెను. ఇంతలో హఠాత్తుగ నచటికి నాయికయాఁడుబిడ్డ రాఁగా, నామెరాక నాయిక కెఱిఁగించుచు సంభోగలక్షణాదులను గప్పిపుచ్చుచుఁ బలుకుచున్నది.—

సీ. పక్వబింబఫలంబు భ్రాన్తిమైఁ గఱచి తా
జనె నీదుకెమ్మోవిఁ జలము మెఱయ;
డుల్లెఁ బర్వునఁ బూవులెల్ల వేనలి వీడి;
పోయెఁ జెమ్మటనీట బొట్టు కరఁగి;
చిల్లులువడెఁ దనూవల్లి జల్లెడవోలె
గడుసుముండులు నాటి గాటముగను;
కనకకంకణఝుణత్కారమ్ము చెవులకు
జ్వర మొదవింపఁ జైసాచికొనుచుఁ
గుఱఁగటం జేరి తుఱ్ఱున మఱలి చనిన
యడవిరాచిల్కకై దేవులాడెదేల?
నెచ్చెలీ! రమ్ము, తడసిన నీననాంద
కోసికొనిపోవు విరిపూవుగుత్తులెల్ల.

ప్రియునితో సురతోత్సవమునఁ దేలి యాకేళీగృహము నుండి వెడలివచ్చు నొకకులుకులాడిని జూపుచు నొకవిటుఁడు తనచెలికానితో ననుచున్నాఁడు.—

మ. వలకేలన్ సవరించుచున్ ఘనకుచ
ద్వంద్వంబుపై వల్వ; డా
పలిచేతం గొని చిక్కువడ్డకబరిన్,
భాసిల్ల గందంపుబూ
తలగుర్తుల్ నలికంబులై యెదనెడన్,
దాంబూలరక్తోష్ఠియై
చెలిఁ గంటే, విడి నేస్తియిల్ స్మరజయ
శ్రీ మించి యేతెంచెడిన్.

ప్రియుఁడు దేశాంతరప్రయాణమునకు సంసిద్ధుఁడై యుండఁగా, దిగులువడి యొక నాయిక తన యాంతరంగిక సఖితో ననుచున్నది.—

మ. సెగ నాఁ గ్రమ్మె దురంతచింత యరుగుం
జెల్వుండు దూరమ్ము నాఁ;
జగదానందకరుండు చందురుఁడు తా
శత్రుండుగా మాఱె న
ల్లఁగఁ; గదుర్ శోకముఁ గూర్చెఁ గోకిల
కలాలాపంబు తాపావహం
బుగఁ; బ్రాణంబులె మందవాయువులు
గొంపోనున్న వోనెచ్చెలీ!

ప్రవత్స్యత్పతిక
భావిప్రవాసవిప్రలంభశృంగారము

ప్రియునివిరహమున కోర్వక దుఃపిల్లు నొక కామిని దురవస్థం జూచి, జాలిపడి యామెచెలి వేఱొకతెతోఁ బలుకుచున్నది.—

చ. ఘనపరితాపశాంతికయి
కల్పితపల్లవతల్ప మల్లనం
దనకరవారిజాతమున
దాఁకినమాత్రన వాడ్పుచున్న జీ
వనజశరాగ్నికాండమహతిఁ
బ్రాపితవహ్నిత, కోమలాంగి, యీ
తనుతరమధ్య తాఁ గుడుచు
తాపము నోపు నెవాఁడు వాకొనన్ !

దేశాంతరమునకుఁ బ్రయాణమయ్యెఁ దన ప్రేయసిపడు పరితాపమును జూచి సహింపనోపక మానిన నాయకుఁడు, 'ఇంతలో నీ వేల ప్రయాణ మాపుకొంటివి' వని చెలికానిచే నడుగఁబడి చమత్కారముగఁ గలకారణమును నుడువుచున్నాఁడు.—

మ. జలజాతంబుపయిన్ సుధాంశుఁ డొరగెన్;
జాల్వారెఁ గ్రొమ్ముత్తియ
మ్ములు నల్లల్వలనుండి; పైఁడిలత
పొల్పుం దెల్లనై పాసెఁ; గ్రొ
త్తలు పూదండలు వాడెఁ దమ్మిమొగడల్
దమ్మింతయే సోఁక; నా
వలకీక్షెన్ సఖ! నాప్రయాణమతి
నుత్పాతాళి భీదాకృతిన్.

**స్వాధీనపతిక; అనుకూలుఁడు**
**ప్రవాసవిప్రలంభశృంగారము**

నాయకునిఁ గొనిరా నాయికచేఁ బంపఁబడి తానే యాతనితోఁ రమించివచ్చి, యాతనిరామి కేవేవో సాకులు వలుకుచు నలసి చెమ్మటలతోఁ దడిసి నలిగియున్న దూతి కను గనుఁగొని నాయిక సంభోగచిహ్నములం గుఱుతించి యోర్వక చమత్కారవచనములతో దాని నెత్తిపొడుచు చున్నది.—

శా. దూంతీ! నీనయనోత్పలమ్ములు
పసందుం బాసెఁ దాంతమ్ములై,
జాతస్వేదపృషత్తు లాననమునన్
జానొందె నా ముత్యముల్,
నాతీ! దీర్ఘములయ్యె నిశ్వసితముల్
నాకోసమై యూరకే
యాంతాయాతవశంబునం బడలితి
వబ్జాతురేమెండలోన్.

వసంతర్తువున విరహతాప మధికమై యోర్వలేమి మరణవ్యవసాయమున నున్న నాయికం జూచి చెలికత్తియ దుఃఖమునఁ దత్తరంపడుచుఁ దోడివారలతో నిట్లు చెప్పుచున్నది.—

మ. చకితైణీనయనాబ్జ, కోమలతనూ
సంప్రేక్ష్య, యాతన్వి తూ
లి కడున్ జక్క-వపెంటిమాఁడిరి
విరాళిం బాళిఁ, జావేఁడి ని
ప్పుకలం బోలిన క్రొత్తలేయివురు
పాన్పుం జేరఁగాఁ బోయెడిన్
వికలత్వాప్తి దురంతమై కరణముల్
బిట్టేర్చునిందామనిన్.

ప్రోషితభర్తృక: (పద్మినీజాతి)

కారణాంతరమునఁ బ్రియుఁడు వచ్చువేళ కొంచె మతిక్రమించిపోవుడు మదనజ్వరార్త యయి నాయికచేఁ బంపఁ బడిన దూతి నాయకునితోఁ జెప్పుచున్నది.—

మ. సొరిదిం గోమలకోకిలారుతము నై
ష్ఠుర్యమ్ము, రాకావిధు
స్ఫురదంగారత, దక్షిణానిలుఘృణా
పూర్ణత్వ మాతన్వనిర్
బారిగో నఱ్ఱులుసాచుచున్నయవి;
రేపున్మాపుఁ, బత్రాదిను
ద్మరజాతమ్ము త్వదాగమభ్రమము
నీరోధించుఁ దద్యత్నముల్.

విరహోత్కంఠిత

విప్రలంభశృంగారము

అలంకారాదులతో నన్ని విధములఁ దయారయి ప్రియుని రాక కెదురుసూచుచు నాతం డేలకో రామి దురంతసంతాపమున మునుఁగునాయిక నాపెచెలికత్తె విరహవ్యథ నోర్చుకొనఁ జేయు నేర్పుమెయి నలంకారాదిలోపమును దెలుపుచున్నది.—

మ. కనులన్ నీ రుజలింపమాను మబలా!
కంగారు గా నంజనం
బు; నివర్తింపుము వెచ్చనూర్పులు మెడం
బూదండ లింపుం జెడెన్;
దనురాగం బడె, డిందుచున్నయది
మెత్తం దోర్లఁగా నుగ్గు; మిం
త నవాఁ డి ట్లగుదెంచువేళ చన
దన్యం బెంచఁగాఁబోకుమా.

ప్రౌఢ

సురతసుఖలాలసతచేఁ దొలుత వాసకసజ్జిక,
పిదప విరహోత్కంఠిత
విప్రలంభశృంగారము

సంకేతసమయ మెఱుఁగఁగోరి సైఁగఁజేయు విటుని దూతికతోఁ జెలులనడుమ మాటాడుచు నొకకామిని సాక్షి ప్రాయముగఁ జేయుచేష్ట వివరింపబడుచున్నది.—

మ. పువ్వువిల్కాని శరంబుడం బెనయనౌ
భ్రూయుగ్మముం ద్రిప్పుచుం
బవలింటం దనదూతితో సఖియై
మాటాడు చంద్రాస్య యో
ర్తు వెసఁ గాటుక దిద్ది కన్నుఁగవ,
నుత్తుంగ స్తనప్రోల్లస
న్నవరత్నాకరతారహారమును
నున్బయ్యెంటఁ గప్పెఁ మొగిఁ.

పరకీయ, కాముకాభిసరణోద్యుక్త యపుట నభిసారికయు

ఒకకులుకులాడిని వలచిన కాముకుఁ డొకఁ డాకలికి యందచందము లూరక వర్ణించికొని మురియుచున్నాఁడు.—

మ. కన, రేరాయనికాంతి యింతిమొగ
మాఘ్రాణించు; ముద్దుంగొనన్
నునుకెమ్మోవిని దొండపండు; మురియున్
గ్రొందమ్మిపూమొగ్గ లం
ట నురోజప్రభ; హల్లకాభ చెయి
యండం దాండవించుం; బదా
ర్చన మర్థిం బొనరించుచున్న వహాహా!
సారెం బ్రవాళద్యుతుల్.

పరకీయ, అందును ముగ్ధ

పాలయలుకచే నిరాకృతుఁడయి వెడలిపోయిన నాయకునిఁ గొనిరా నొకకామినిచేఁ బంపఁబడిన దూతిక తానే యాతనితో రమించివచ్చి, 'నీ చెప్పినట్లే చేసితిని. కాని, యాతఁడేలనో కాఠిన్యము వహించినాఁడు. వాని కెవేవ్రో బోధించుచు నేనింత యాలస్యము చేసితి' నని చెప్పెను. దాని లక్షణములనుబట్టి రహస్య మెఱింగికొని నాయిక కోపము నడంచికొనుచు దానినిట్లు నిందాస్తుతి చేయుచున్నది.—

చ. చెనకినచాతురీగరిమఁ
జేసియ వచ్చితి వీవు నావచిం
చినపనియెల్ల! నన్యహిత
చింతకు లుర్విఁ గలారె త్వాదృశుల్
జనులు! మదర్థమై యరిగి
లావఱి డస్సితి వెంతయున్! శ్రమం
గొనక క్రియాఫలమ్ము
లొనగూడునటే మృదులాంగి దూతికా!

స్వీయ, ప్రగల్భయు
ధూతిక యభిసారిక

ప్రణయకలహమునఁ గినిసి పలుకక నాయిక మౌనము వహింపఁగా, నాయకుఁ డామె చెలికత్తెలతో నిట్లను చున్నాఁడు.—

చ. విరులు ధరింపఁబోదు సరవిం
గబరీభరమందుఁ గూర్చి; సు
స్థిరమృగనాభిచిత్రకముఁ
దీరిచి దిద్దదు నెమ్మొగమ్మునం;
దిరుగదు నాదుప్రోల నడ
తీరు లొయారము మీరఁ, దొల్లిటిం
దెరువున; నాదుప్రాణసఖి
తెల్పదు విప్రియ మింత కింతయుఁన్.

ఖండిత, మధ్య, ధీర

అన్యాసంగకలంకితుఁ డవునేని నాయకుఁడు ధృష్టుఁడు, లేనిచో ననుకూలుఁడు

ఎట్టెటో మెల్లమెల్లన వశంగత యయి నాయకుని యింటి కరిగిరాయే యాతనితోఁ గ్రీడించుచుండిన యొకమించు బోఁడి ధూర్తులగు నిరుగుపొరుగువా రనుమానించి కావించిన గందరగోళముచే నాతనియింటికిఁబో మాని తెఱియెఱిఁగి కనం బడినచోట మాటాడుచుండెను. వెల్లడియై గోలగా మాఱుటచేఁ దుద కడియు వదలి చూపుమాత్రమునన సంతసపడుచుండెను. ఒకనాఁ డేకాంతమునఁ గాకతాళీయన్యాయముగఁ నెదురు వడిన యావగలాడికి వ్యసనార్తుండవు నా కాముకుఁ డిట్లను చున్నాఁడు.—

శా. బాలా! తొల్లిటి కౌఁగిలింతలు,
కుచస్పర్శంబులున్, ముద్దు, లా
లీలాజాలము విస్మరించితివి నాఁడే
ధూర్తులుద్వృత్తి; నే
వేళం గూడదు పల్కరింతయె
శుగాప్తిం దూల నద్దాన, నో
బేలా! నీమృదుదర్శనమ్మె కఱవై
ప్రీలించు నాయుల్లమున్

పరకీయ, విరహవిప్రలంభశృంగారము

కారణాంతరమున రాక ప్రియుం డాలసింప వ్యసనార్త యయి దురపిల్లు నాయికచేఁ బంపఁబడినదూతిక నాయకునితోఁ జెప్పుచున్నది.——

మ. కన సిగ్గిల్లుఁ గళంకి నవ్వొలయు
    నేకళ్యాణినెమ్మోముఁ దా;
గొనబా నేచెలిపల్కు చిల్కనును
    పల్కుంబొంకముం గెల్చు; మిం
చు నవేందీవరగంధవాహుఁ బృష
    దశ్వ శ్వాస లేతన్వి; వ
వ్వనితం గారియవెట్టుచున్నయవి
    నీప్రాపిట్లు లే కవ్వియే.

స్వీయ, మధ్య, విరహోత్కంఠిత
విరహవిప్రలంభశృంగారము

ఒక్క చక్కనిగబ్బిగుబ్బెతం గని మోహించిన విటుం డొకరుఁ డద్దానియందచందములు తననేస్తితోఁ జెప్పుకొనుచున్నాఁడు.—

మ. అవు వీణాధ్వని నిష్ఠురమ్ము
కలకంఠాలాప తాఁ బాడుచోఁ;
దౌవచుట్టమ్ము మెఱుంగు మట్టిగలియున్
దోరంబుగా నవ్వినన్;
నవకంబుం జెడు నబ్జముల్ నవము లా
నాళీకపత్రాక్షిక
న్నవ్రమోలన్; మెయిఁ బాయు మించు తృటిఁ
దద్గాత్రద్యుతుల్ గాంచుచోన్.

పరకీయ

అయోగవిప్రలంభశృంగారము

మఱొకజవరాలికౌఁగిట రేయిం గడపి వేఁకువ నేతెంచిన ప్రియునిసంభోగచిహ్నములం గుఱుతించి యొక నాయిక కినుక నడఁచికొనుచు నర్మవాక్యముల నాతనిమర్మములు భేదించుచున్నది.—

మ. నిజ మంతే, కల ప్రేమ మిక్కుటము నా
నీకంటె నాకంటె; వి
ట్లిజుకుం జూడక తెల్లవారుసరికే
యిల్సేరి తీక్షింప నన్;
భుజయుగ్మమ్మును గ్రమ్మె రాగ మెసు
ఱొమ్మం బత్రసంజాత; మొ
ప్పెఁ జుమీ కన్నులఁ గున్కుమిన్, నుదుట
సంవృదమ్మె లాక్షాదులన్.

ఖండిత, మధ్య, ధీరాధీర; ధృష్టుఁడు

ఈర్ష్యావృతవిప్రలంభశృంగారము

వసంతర్తువునఁ బ్రియుని దేశాంతరగమనమున కంగీకరింపక పరితపించుచునదయ్యు నొకయెమ్మెలాడి సమ్మతించుచునది వోలెఁ బలుకుచున్నది.—

శా. ఈనిండామని దూరదేశమునకే
వేగం బ్రయత్నింతె, పో,
కాని మ్మట్టులె, భీతి నొంద నెదలోఁ
గాసంతయే నిట్టితా
పానన్ ; గైరవసారసౌరభకన
ద్వాయుప్రచారంబు రే
రానిండారినజ్యోత్స్నతోడ నిశలం
బ్రాణేశ ! యేపొందెదన్.

## ప్రవత్స్యద్భర్తృక
## భావిప్రవాసవిప్రలంభశృంగారము

పొలయలుకచే బిఱ్ఱబిగిసిన ప్రేయసిని నాయకుఁడు ప్రతిమాలుకొనుచున్నాఁడు.—

మ. కుసఖీదోషజరోషమున్ విడచి
చక్షుర్జాద్యమెల్లం జనన్
వెస నీనవ్వుమొగంబుఁ జూపుము; వచః
పీయూషసారంబు శ్రో
త్రసుఖ మ్మొప్పఁగ నిప్పుడే కురియుమా;
తాపమ్ము వోవం గృపా
రసశీతమ్ములు చూపులం బరపవే
రాకేందుబింబాననా!

ఖండిత

సఖీవచనములయందలి సత్యాసత్యములంబట్టి నాయకుఁడు ధృష్టుఁడు, అనుకూలుఁడు కావచ్చును.

ప్రణయకలహమునఁ బ్రియుఁడు దరిసిన నలుకయు, దూరంగతుఁడైన బరితాపమును బొందు నాయికం జూచి జాలి పడుచు నద్దాని చెలి మఱొకరితతో నాయికయవస్థంగూర్చి పలుకుచున్నది.—

శా. మానమ్లానమనస్కయై కన దోగిం
బ్రాణేశుఁ గన్నెత్తిమే;
హో నాతండు, దురంతచింత మునుఁగున్
బోనంబు నీ రుట్రెఁబో;
కానీ తుం డవ్వుచో నొకట్టులు కొనున్
వ్యర్థంబ యీముగ్ధ తా
మానవ్యాఖ్య; నతండు వెండి చనఁబోఁ
బ్రాణంబు కంఠస్థమా.

మధ్య, ధీర, కలహాన్తరిత; ధృష్టుఁడు.

రూప లావణ్య వయోవిభవమ్ముల నొప్పు నొక విలాసవతిం జూచి వలచిన కాముకుం డొకరుఁడు స్మరవ్యసనార్తుండై తన యనుఁగుజెలికానితో నమ్మానినిసొగసు బొగడుకొనుచున్నాఁడు.—

మ. అమల మ్మాచెలిపల్కు- విన్నఁ గలకం
ఠాలాపముల్ కూర్చు రో
గము వీన్దోయికి; నిందుగౌరవ మవ్వం
గన్గోనియందాఁక నా
మెమొగంబుఁ; గనుమూసియుం- హారిణుల్
మే లింతికన్దోయిచెం
త; మనంజాలదు పైఁడితీవసొబగా
తన్వంగిఁ గన్గొన్నచోఁ.

## పరకీయ

## అయోగవిప్రలంభశృంగారము

**సమాప్తము.**

# లక్ష్మీ గ్రంథమండలి, తెనాలి

మా గ్రంథమండలిలో సంవత్సరమునకు నాలుగు పుస్తకములు ప్రకటింపఁబడును. అముద్రితాంధ్రగ్రంథముల కెక్కువప్రాధాన్య మీయఁబడును.

పౌరాణిక, ఆర్థిక, రాజకీయసంబంధములగు గ్రంథములు, సనాతనాధునాతనకవులచే వ్రాయఁబడినవి ప్రకటింపఁబడును. వెలువడనున్నది— పండితపామరుల కుపయోగించునది. ఎల్లఱను విద్యావంతులను జేయునది. నవరసభరితమైనది.

**"లో కో క్తి ము క్తా వ ళి"**

సామెతలు భాషకు ఆమెతలు.

*'Proverb is the wit of one and the wisdom of many.'*

"కందువమాటల సామెత
లందముగాఁగూర్చి చెప్పనది తెనుఁగునకుఁ
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధులకెల్లన్."

*Proverbs are the lamps to words.*
(Arabic)

ఈముక్తావళియందు పదునాల్గువేల సామెతలు ప్రయోగములతో నుండును. అచ్చుప్రారంభించినాము. ఆంధ్రులందఱు త్వరపడుడు. మా గ్రంథమండలిలో చందాదారులుగాఁజేరి, మమ్ము ప్రోత్సహించి, ఆంధ్రభాషోద్ధారకులు కండు.

"సంస్కృతన్యాయములు"

"తెలుఁగు జాతీయములు"

ఈరెండును ప్రత్యేక సంపుటములుగాఁ బ్రకటింపఁబడును. ఆంధ్రులెల్లఱు వీటి ప్రయోజనము పొందుదురుగాక. ఆంధ్రులందఱు, మాగ్రంథమండలియం దాదరముంచి, తమవద్ద సామెతలు, న్యాయములు, జాతీయములు ఉండిన యెడల పంపిన వారివారి పేర్లతో ప్రచురింపఁబడును.

*The proverbs of the mother tongue are still more helpful in matters relating to the world of sense.*

వివరములకు వెంటనే వ్రాయుడు.

మే నే జ రు,

లక్ష్మీగ్రంథమండలి, తెనాలి.

# LAKSHMI GRANDHA MANDALI,

## TENALI.

---

# " *Lokokthi – Mookthavali* "

సామెతలు భాషకు ఆమెతలు.

*Proverb is the wit of one
and the wisdom of many.*

" కంటకవర్మాదుల సామెం
లాడిముగాఁగూర్చి చెప్పినటి తెనుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధుల కెల్లన్."

*" Proverbs are the lamps to words "*

*"Literature is the ornament of language; and poetry is the ornament of literature."*